# దివ్యజ్ఞాన విషయికోపన్యాసములు

## ప్రథమోపన్యాసము

దివ్యజ్ఞానమననేమి

ఇది

శ్రీమతి అనిబెశంటు దొరసానిగారి యుపన్యా
సముల కాంధ్రీకరణము.



*By*

హరి బాపయ్యశర్మ

ఆంధ్ర ప్రధానోపాధ్యాయుడు

ఓరంగల్.

---

చంద్రికా ముద్రాక్షరశాల,

గుంటూరు.

1920.

# విషయ సూచిక





# FOREWORD.

These six popular lectures on Theosophy were delivered at Adyar, Madras by Mrs. Annie Besant and were intended to offer a simple outline of the fundamental ideas of Theosophy to those unacquainted with these conceptions.

Now as an humble service to the mother tongue by means of translation I place this work (First lecture) only before the Telugu reading public, with the help of which a person of ordinary intelligence and education can easily acquire a synthetic knowledge of Theosophy.

This is my first attempt and mistakes due to my imperfect knowledge may kindly be corrected by Pandits and Savants and suggestions coming from such revered sources will be thankfully received and utilised for the next edition.

For the suitable rendering into vernacular of scientific terms I have been guided by the books on physics and chemistry in Telugu edited by Mr. K. V. Lakshman Rao M. A. and for philosophical terms I am indebted to the translation of the Bhagavad Gita by Mrs. Annie Besant, to whom I here tender my grateful acknowledgements In some places of the book I have also been helped by Mr. P. Sundaram Iyer, Head master, Warangal (Matwada) for which I offer him my cordial thanks.

Many and sincere thanks are also due to Mr. B. P. Wadia the Hon. Manager, T. P House Adyar, and to the Head of the Translation committee Mr. R. G. Misra Dy. Col Ghazipoor for their kind permission for translation of the work in question.

Khamamett, 25—3—20. HARI BAPAYYA.

శ్రీ

# పీఠిక

ఇవి మొత్తమాఱుపన్యాసములు. ఈ చిన్నమాలిక, లోకవిఖ్యాతయును, బ్రహ్మజ్ఞాన సంఘాధ్యక్షురాలును నగు శ్రీమతి అనిబెసంటు దొరసానిగారి వలన అడయార్ [చెన్నపట్టణము] నందు సమకూర్పఁబడెను. కొన్ని దినముల క్రిందట నాకీయుపన్యాసములఁ జదువుటఁ దటస్థించెను. అపుడు వీనిని మాతృభాషయం దనుసందించిన యెడల, దివ్యజ్ఞానసమాజ సంబంధమైన భావములు కొంతవఱకు సాముదాయకముగనైన నాంధ్రలోకమునకుఁ బరిచయము నగునని యుద్దేశ మొకటి కలిగె. ఈ యుపన్యాసములను కరగ్రంథరూపమున విడివిడిగాఁ బ్రకటించిన యెడల బాగుగనుండునని యనేక మిత్రులు సకారణముగ సూచించిరి. ఆకారణమువలన, నీ ప్రథమోపన్యాసము మాత్రమే ప్రస్తుతము ప్రకటింపఁ బడుచున్నది.

అల్పజ్ఞుఁడనగు నేనిట్టి ప్రయత్నమునకుఁ బూనుకొనుట పండితమండలికి పరిహాసముగఁ దోఁచవచ్చును. ఇయ్యది నా ప్రథమప్రయత్నము. దోషంబులున్నచో రాబోవు కూర్పునందు సవరించుకొనువాఁడను. ఇమ్మహావిషయముయొక్క భాషాంతరీకరణమునకుఁ గడంగుట నాకట్టి విషయమునందుగల యభిమాన బలమేకాని పాండిత్యబలముగాదు.

దరిద్రుఁడనగు నేనిక్కార్యమునకుఁ బూనుటఁ గని మన్మిత్రులగు మ. రా. శ్రీ. పర్చా శేషగిరిరావు [సఖ్తాదారు కారేపల్లి] పంతులుగారు గ్రంథముద్రణావ్యవహారములకుం దోడ్పడి తమ యద్వితీయ పరమార్థమును వ్యక్తీకరించిరి. ఇందులకు వారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నగుటయేగాక, వారియట్టి ధార్మికభావము వాసనాత్మకముగ గాక వ్యవసాయాత్మకముగఁ బరిణమించుటకును, లౌకిక పారమార్థిక జీవితంబులు సమస్తకల్యాణములచేఁ బ్రకాశించుటకును, ఈశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడ.

25 మార్చి 1920<br>
ఖమ్మంమెట్టు [స్తంభాద్రి]

ఇట్లు,<br>
సకల సుజన విధేయుఁడు,<br>
హరి బాపయ్య శర్మ.

*Theosophical Publishing House.*
*Adyar, Madras 2nd April 1918.*

To Mr. Hari Bapayya Sarma

Dear Sir,

You are hereby granted permission to translate "POPULAR LECTURES ON THEOSOPHY & HINDU IDEALS" into Telugu; but we suggest that you would first consult the head of the Translation Committee Mr. R. G. Misra Dy. Col. Ghazipoor,

Yours faithfully,
(Sd). B. P. WADIA,
*Hon. Manager.*

(True Copy).

## NOTE.

Permission for translation was kindly granted by Mr. B.P. Wadia, The Hon Manager T. P. House, Adyar and Mr. R G. Misra, the Head of the Translation Committee (in the month of April 1918).

H. B.

# అనువాద గ్రంథ సమర్పణమ్

శ్లో॥ ఈక్షణాధ్యాన సంస్పర్శైః
మత్స్య కూర్మ విహంగమాః
పోషయంతి స్వకాన్ పుత్రాన్
తద్వత్పండిత వృత్తయః ॥

కాబట్టి

ఏమహాపండితు లెచ్చటెచ్చట లోకమునందు పారమార్థిక జ్ఞానాభివృద్ధికి యథాశక్తికృషి సలుపుచున్నారో, అట్టి మహానుభావులకు భక్తియుక్తంబుగ నీ చిన్నియనువాద గ్రంథంబు సమర్పితంబు.

ఖమ్మంమెట్టు }
25—3—1920 } హ. బా.

శ్రీ

# దివ్యజ్ఞానమన నేమి?

హితులారా!

ఈమధ్యకాలమున దివ్యజ్ఞానమన నేమి? అను విషయమునుగురించి యనేకపరిశోధనలు జరుగుచుండుటఁగని దాని యొక్క బాహ్యస్వరూపమును గురించియు, తన్ముఖ్యోపదేశములనుగురించియుఁ గొంతవరకుపన్యసించినయెడల ప్రస్తుతము నా నివాసమిచట సత్కాలక్షేపమందు వినియోగింపఁబడినట్లౌనని తలంచితిని. ప్రస్తుతవిషయమును, సాధ్యమైనంతవఱకు సాంకేతికపదరహితముగఁ జేసి సాధారణవిద్యావివేకములచేఁ బఱగు ప్రతిమనుష్యునకువిషయగ్రహణమునకారంభముననవసరమగు సులభమార్గముననే విశదపఱచుటకుఁ బ్రయత్నించుచున్నాను. దివ్యజ్ఞానము, విద్యావివేక సంపత్తిలేనివారికి సుబోధకమని నేనెన్నటికినినటింపఁజాలను. సాధారణమైన విద్యావివేకసంపదలగలిగి, ప్రాపంచికవ్యవహారములయెడ, తనబుద్ధి నిప్రయోగింపగల ప్రతిమనుష్యుడు, బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన ముఖ్యోపదేశములను సాముదాయకముగనైన గ్రహింపగలడు. జీవితము (Life) యొక్క గొప్ప సంయోగీకరణవిధానమును గ్రమముగా గ్రహింపవలెనన్న, మానవునకేమాత్రమయిన విద్యావివేకసంపత్తి యబ్బదేని అయ్యది యసాధ్యమనియే చెప్పవలెను. కొన్నియుపదేశములను విద్యా

రహితుఁడగు మానవుడు సైతము, ఆరంభాచరణము నిమిత్తము గ్రహింపగలడు. కాని ఏవిధానమునందట్టి యుపదేశవిషయములు పరస్పరము జతగూర్పఁబడుచున్నవో, ఏరూపముందవి యేకీభవించి జీవితముయొక్క మహాసంయోగీకరణమును నిర్మించుచున్నవో, అట్టి విధానములను లేక యట్టిభావనలను మనుష్యుఁడు కొంతవరకు విద్యాసంపత్తిని పడయక గ్రహింపఁజాలడు.

దివ్యజ్ఞానమను విషయము 1875వ సంవత్సరమునఁ ప్రపంచమునఁ బ్రచారములోనికివచ్చెను. కాని, మానవజాతికి విజ్ఞానము, నాగరకత యనునవి యెంత ప్రాచీనములో, దివ్యజ్ఞానమనునది యంత ప్రాచీనమైనది. అది, ప్రపంచమునందలి యనేకభాషలలో ననేకనామములతోఁ బ్రసిద్ధికెక్కుచున్నది. భాషలు, నామములు, వేర్వేఱుగానున్నను, దానిభావమన్నిభాషలలోను, నామములలోను సర్వకాలముల యందేకవిధముగనే యున్నది. నాస్తికమత మంతకంతకుఁ బ్రపంచమునందలి వివిధజాతులయొక్క నాగరికతాశకటమును గమనపాయకరముగను, తీవ్రముగను నడపించుకొని పోవుచున్నందున బ్రహ్మవిద్యావిషయముయొక్క పునఃప్రకటనమును గావించుట మనకాలముననే యత్యంతావశ్యక విషయముగఁ బరిణమించె. ప్రకృతిశాస్త్ర మభివృద్ధిజెందినకొలఁది, అయ్యది భౌతికమార్గమునను గమించుచుండెను. మఱియును, ప్రకృతిశాస్త్రజ్ఞాన మభివృద్ధి జెందుచున్నకొలఁది ప్రకృతిశాస్త్రజ్ఞుడజ్ఞేయవాదిగ (Agnostic) బరిణమించిపోవుట యతనికొక స్వాభావి

క లక్షణమగుచుండెఁ. ఆకాలమందు యూరపుఖండము యొక్క భావప్రపంచమున నొక సందిగ్ధసమయము సంభవించెను. అదియెట్టిదియన. మానవుఁడింద్రియగోచర విషయములను మాత్రమే గ్రహింపగలఁడనియు, హేతువువలనను, అనుమానము వలనను, నిరూపింపఁబడునంతవరకు మనుష్యుఁడు గ్రహింపగలిగియున్నాఁడనియు, వాగాది యింద్రియములకును బుద్ధికినియతీతముగ జ్ఞానసంపాదనకేవిధమయిన సాధనాంతరము లేదనియు, తనకన్యముగు ప్రపంచముయొక్క స్పర్శనుబొందుటకేవిధమయిన మార్గము లేదనియు, ఆకారణమువలన జీవితముయొక్క అగాధమును శాశ్వతమునగు మూలతత్త్వములను గుఱించిగాని, వానియుత్పత్తి గమ్యస్థానములను గుఱించిగాని, ఈశ్వరుఁడు, జీవుఁడు, అమృతత్వము మున్నగు నామములను గుఱించి వచింపఁబడు విషయములుగాని, గ్రహింప నసాధ్యమనియు, పరిపరివిధముల కలవరము సంభవించె. ఈయభిప్రాయములు పాశ్చాత్త్యుల భావములువ్యాపించిన ప్రాగ్దేశములందును, ప్రాశ్చమేయుల యాధేయరాజ్యములందును, (colonies) వ్యాపించి సమస్తప్రపంచము నంధకారముచేఁ గప్పివేయవలెనని ఝుళిపించెను. అంతట మానవకోటికి సదాసంరక్షకులుగనుండు మహాత్ములు, దేశకాల పాత్రముల ననుసరించి మానవునకు లభించియుండు మానసిక లక్షణమునకుఁ దగినటుల నతిప్రాచీనమయిన నీసత్యవిద్య నభినవరూపముగఁ బ్రకటించుట యెంతయు ధార్మికమని తలపోసిరి. ఆప్రకారము ప్రపంచమున నొక నూతన జాతీయవికాసము నిమిత్తము సంభవించుచున్న ప

రిస్థితులకుఁ దగినటుల నానావిధమతముల యందంతర్హితమయి
న సత్యవిషయము మనుష్యునకు బహిరంగపఱచఁబడెను.
ప్రపంచమందలి యే జాతియు (Nation) తన విశ్వాసమువలన
బొందనగు ప్రత్యేకలాభములు భంగపడకుండులాగు సమస్త
మతములును ఒకేయుద్దేశమును గుఱించి పనిచేయుచున్నవి.
కనుక, ఒకవృక్షము యొక్క శాఖోపశాఖలవలె బ్రకాశించు
చుండు సకలమతములయొక్క మూలాధారమును గుఱించి
పునఃప్రకటనము గావింపబడెను.

అపుడు మతమును గుఱించి లోకమునకు బహిర్గతపఱ
చట యత్యంతావశ్యకవిషయమైయుండెను. కారణమేమి? ప్రకృతి
శాస్త్రము సిద్ధాంతమునే విస్తారముగ వ్యాపింపజేయుచుండెను.
కాని యావ్యాపన భిన్నమార్గమున భిన్నోద్దేశము నిమిత్తమై
యుండెను. (అది ప్రకృతిశాస్త్రము) నానావిధ మతస్వరూప
ములను "తారతమ్యముగల పురాణకథలు"ను శీర్షిక క్రింద విభ
జించిపెట్టెను. కాని పూర్వులు వదలిపెట్టిపోయిన ప్రాచీన
శిథిలము (Rulns) లను గుఱించి జాగరూకతతోఁ జేయఁబడిన
పరీక్షలవలననేమి, పురాతనవస్తు శాస్త్రజ్ఞునివలనను, చరిత్ర
కారునివలనను జేయఁబడిన పరిశోధనలవలననేమి, నానావిధ
ప్రాచీన సభ్యతలకు సంబంధించిన గ్రంథసంచయావలోకనము
వలననేమి, భూమ్యంతర్భాగ పరిశోధనమువలననేమి పురాతన
శాసనములను గుఱించి చేయఁబడిన శాస్త్రీయ (Scientific)
వ్యాఖ్యాన భాషాంతరీకరణాదులవలననేమి, ప్రపంచమునందలి
సమస్తమతములయొక్క ముఖ్యసిద్ధాంతములు, పరస్పరము

భేదించక, ఏకీభవించుచున్నవనియే ధృవపడుచుండెను. అన
గా నాయా మతములయొక్క ధర్మశాస్త్రములన్నియు వాని
యాదిమ నాగరికదశయందు సమన్వయమునే గలిగియుండెను.
ఆయా మతస్థాపకుల చరితంబులు పరస్పరము సరిపోలుచునే
యుండెను, ఆయామతములకు సంబంధించిన నానావిధకర్మలు,
సాంప్రదాయములు ఆచారములు, సంస్కారములు, బాహ్య
వేషమున కనువగు వివరణములయందు బరస్పర వ్యత్యాస
ముగలిగియున్నను పరస్పరి భావములయం దేకత్వానుసం
ధానమే పొడసూపుచుండెను. సర్వమతములను తర్కించి
యనమానపఱచవలెననెడి యుద్దేశముగాని, అట్టి విశ్వాసము
గాని, లేనివారలవలన నట్టి మేకభావము ప్రకటితమగు
చుండె. మతము, తరువాతి కాలములయందెంత సంస్కరింపఁ
బడుచు వచ్చినను, అది మనుష్యుని యజ్ఞానముయొక్క ఫల
మని తర్కింపఁబడెను. మనుష్యుని యజ్ఞానమే మతమనియు,
జ్ఞానాభివృద్ధియగుటయే తడవు మతముయొక్క పిశాచకాల
ఘంటానాదము మ్రోగెనని చివరకు నిశ్చయింపఁబడెను.
కాఁబట్టి ప్రాచీన సిద్ధాంతములయొక్క పునఃప్రకటనము
గావింపఁబడినపుడు యూరపుఖండ మీస్థితియందుండెను.

ఆరంభమున దివ్యజ్ఞాన విషయమునకు సంబంధించిన
కార్యములు, అమెరికాయూరపుఖండములందు నివర్తింపఁబడు
చుండెను. ప్రాచీనభావములను వ్యక్తపఱచు శబ్దమునకుగాను
గ్రీసుదేశీయ భావములవలన, దివ్యజ్ఞానవిషయిక వ్యూహము
(plane) లాకర్షింపబడెను. క్రీస్తు జన్మించిన తరువాత కొంత

కాలమువఱకు దివ్యజ్ఞానమను (Theosophy) శబ్దమూకాల
మునందలి ప్లాటో మహాశయుని నవీనసాంప్రదాయక (schools(
శోధలయందుఁ దఱుచుగా వాడబడుచుండెను. పిమ్మట తత్త్వ
జ్ఞానమునకు సంబంధించిన సాంప్రదాయములవారెల్లఱును
క్రమముగా నీశబ్దము నుపయోగించుకొనుచువచ్చిరి. యూరో
పుఖండమందలి గూఢమతవాదులందఱొకరితర్వాతనొకరీశబ్ద
మునే వాడిరి. యూరపుఖండపు భావములలో నీశబ్ద మొకా
నొక యర్థముతో సంబంధింపబడినందున, మతశాస్త్రీకవిష
యానుభవజ్ఞానందఱు దివ్యజ్ఞానమని యుదహరింపఁబడినపు
డెల్లను, తత్క్షణమే దానియొక్క విలక్షణభావమును గ్రహిం
చుచువచ్చిరి. ఆశబ్దమొక ప్రాచీనయర్థమును గలిగియుండి,
విద్వాంసుల హృదయమునకుఁ దన సంపూర్ణమైన భావమును
వ్యక్తపఱచెను. కాబట్టి క్రీస్తుశకమునకుఁ బూర్వమునుండియు
గ్రీకు దేశీయమైన థియసాఫియాయను శబ్దమునేగాక సంస్కృ
తమున బ్రహ్మవిద్య యనుశబ్దమునుగూడ గాంచుచున్నాము.
బ్రహ్మయన దేవుఁడు, విద్యయన జ్ఞానము, కనుక బ్రహ్మవిద్య
యన (Theosophy) దివ్యజ్ఞానము. ఇది మరియొక నామము
చేఁగూడ వ్యవహరింపఁబడుచున్నది. అది పరావిద్య లేక
పారమార్థికజ్ఞానము.

ఒకానొకప్పుడు ఒక శిష్యుడు తన గురువుతో జ్ఞాన
మునుగురించి కొన్ని సంగతులనడిగెను. అంతట "జ్ఞానము
రెండువిధములనియు, అందొకటి లౌకికము, మఱియొకటి పార
మార్థికమనియు, శాస్త్రములు, కళలు, వాఙ్మయము, మత

గ్రంథములు, వేదములుమున్నగు నవి ప్రకృతిధర్మ (Lower knowledge) బోధకములనియు, ఏవస్తు జ్ఞానమువలన నితర సమస్తపదార్థములయొక్క జ్ఞానము మనకు స్వతసిద్ధముగ లభించుచున్నదో అది పారమార్థిక జ్ఞానమనియు గురువు వచించెను. ఈ పారమార్థిక జ్ఞానమే యత్యంతోత్కృష్టమైన యీశ్వర జ్ఞానము. అదియే దివ్యజ్ఞానము. ఆ జ్ఞానము నిత్యము, లేక శాశ్వతమైన జీవమనికూడ వక్కాణించెను."

మతములు మనుష్యుని యజ్ఞానఫలభూతములను ప్రకృతి శాస్త్రముల బహిరంగవాదమునకు విరుద్ధముగ మతములన్నియు మనుష్యుని యజ్ఞానజన్యములుగావనియు, ఈశ్వరజ్ఞానమువలననే యుత్పత్తియగుచున్నవని గంటబ్రమోగినటుల జయసూచక ప్రకటనము గావింపఁబడెను. మతములు సర్వకాల సర్వావస్థలయందును గలవు. వానివలననే, మనుష్యుడీశ్వరాన్వేషము సేయుచున్నాఁడు. మతమనగా నేమి? మతమనగా నీశ్వరుని గురించి మానవుఁడొనర్చు నిరంతరాన్వేషము. ప్రపంచమందలి మతము లీశ్వరునిగురించి చేయఁబడునట్టి యన్వేషకవిధానములుగాని వేఱుగావు. మీరు, నానాదేశచరిత్రములం దెచ్చట జూచినను ఏనాగరకతనుగాని, ఏజాతినిగాని, పరీక్షించినను భూమండలముయొక్క పూర్వపశ్చిమాగ్రముల కుంజని, మీకిచ్చవచ్చిన యేస్థలమందుగాని, యేకాలమందుగాని నిలువబడి గమనింపుడు. అపుడు మీరేమి గాంచుచున్నారు? సర్వత్రి, భగవంతుని గాంచుటకు నతితీవ్రమైన మనుష్యునితృష్ణావస్థయే మీకు గోచరించుచున్నది. మానవుని హృదయ

కుహరమునుండి వినఁబడుచున్న ప్రతిధ్వని యిదియే, ఈశ్వరా! హరిణమువనంబున తీయనిజలంబులకెట్లు పరితపించుచున్నదో, నాయాత్మ నిన్ను బొందుట కట్లభిలషించుచున్నది, యని యొక హీబ్రూ గాయకునివలనఁ బాడఁబడెను. నిజముగా నీభావమెంతయు సమంజసముగ నున్నది. జలంబులు తమ యుత్పత్తిస్థానమును వదలి నిమ్నోన్నత ప్రదేశముల నింపు కొనుచు దమ మట్టము నెట్లు పొందుటకు యత్నించుచున్న వో, అట్లే మనుష్యాత్మ దైవముతో నైక్య మంతస్తున కగయ నన్వేషించుచున్నదని గయారుడోనో బ్రోనో ఉపయోగించిన యుపమాన మెంతయు సయుక్తికముగ నున్నది.

ఆశతో గాని, కోరికతో గాని, విశ్వాసముతో గాని ఈశ్వరు నెఱుంగుటయేగాక అచంచలమైన మనోనిగ్రహముతో బాహ్యప్రపంచమున నిచ్చటనో గాక అంతరప్రపంచమునగా మీహృదయంబులలో నిట్టి దివ్యశక్తికనుగొనఁ బడవలెను. మీరు ప్రకృతిశాస్త్రజ్ఞుని కడకేగవలదు. ఏల? అతఁడు సృష్టి (Nature) యందొక ధర్మము (Law) కలద నియు అది యెన్నటికిని మారదనియు, మీకు చెప్పును. మీరు తార్కిక, వేదాంతులకడకేగవలదు. వారు హేతువాదములను మీయెదుటఁ బెట్టుదురు. మీకు కావలసినది విశ్వాసముగాని హేతువాదముగాదు. మీరు చిత్రకారుని కడకేగవలదు. అతఁడుమిమ్ముల గొంతవఱకాకర్షించినను, ఈశ్వరనిర్మిత పదార్థముల సౌందర్యమును, శృంగారమునుగురించి యేమిటో సంభాషింపగలడు.కాని యంతమాత్రమేచాలదు. మీరుతా

త్ర్యకుని కడకేఁగవలదు. అతడు నిరుపాధిక * (Abstraction) విషయములను మాత్రమే పృథక్కరణముజేసి వానిఫలిత మును వ్యక్తపఱచుటకు బూనుకొనును. కాఁబట్టి బయట వెదకుటకుజనినను ప్రయోజనములేదు. మీ రాంతరప్రపంచమున కఱుగుటకుద్యుక్తులుగావలెను. బాహ్యప్రపంచమున నేమియులేదు. మీయందంతర్గర్భితమైన చైతన్యమనెడియగాధ సముద్రమునసర్వ్యయముగాఁ మనుగుడు మీహృదయ నికుంజమందు దాగియున్న రహస్యరత్నమును న్వేషింపుడు. యదార్థముగ నట్టిరహస్యరత్నమే గాంచదగినది. మీరు హృదయకమలమధ్యమందు నధిష్ఠించియున్న పూరుషుని దర్శించవలెను. అచటనే మీరువానిని కనుగొనఁగలరు. అచట మీరువానిని కనుగొనినపుడు, ఈవిశ్వమునందలి ప్రతిపదార్థము వానిని గుఱించిగానము సేయుచున్నటులమీకుఁ దక్షణమేగోచరింపగలదు. ప్రథమమున మీరు వానిని మీయాత్మయందుఁగాం చుడు. పిమ్మట మీరువానిని యంతటను జూడగలరు.

ఇది ముఖ్యమైనసత్యము. సత్యములలోకెల్ల సత్యము. ఇదియే దివ్యజ్ఞానము. ఆధునిక ప్రపంచమున దివ్యజ్ఞానమును గుఱించి చేయఁబడిన జీవనంతంబగుపునఃప్రకటన మిదియె.

పిమ్మట దివ్యజ్ఞానము మనకురెండు ముఖ్యసిద్ధాంతములనుగుఱించి బోధించుచున్నది. అందొకటిఈశ్వరునియొక్క సర్వాంతర్యామిత్వము అనగా నీశ్వరుడంతటను అన్నిపదార్థ

---

*తలంపులువేరు. తలంచెడు మనస్సువేరు. అనిమానసికల్పనలను విభజించు పద్ధతులను నిరుపాధికము లందురు.

ములయందునుగలదు. ఆధునిక దినములలోఁ బాశ్చాత్యులమ
స్కిష్క పేటిక ఈభావరత్నముచేఁ బ్రకాశించుచున్నప్పటికిని
తిరిగి పరిశోధింపఁబడుచున్నందున బహుజనులకిది కొంతవ
ఱకద్భుతముగను, నవీనముగను, దోఁచబడినను ప్రతిప్రాచీన
మతగ్రంథమందీభావమే గనుగొనఁబడుచున్నది. దీనీ విషయ
మునే మహామతగ్రంథమందైనను గ్రహింపవచ్చును. మనకం
దఱకును బ్రియమై నిత్యమూపయోగమునందుండు శ్రీమద్భగవ
ద్గీతావాక్యమును గనుడు.

శ్లో॥ యచ్చాపిసర్వ భూతానాం
బీజంతదహమర్జున
నతదస్తివినాయత్స్యా
న్మయాభూతంచ రాచరమ్. 10. 39

శ్లో॥ అథవాబహునైతేన కిం జ్ఞాతేనతవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేనస్థితో జగత్. 10. 42

ఇక ప్రాచీనమతగ్రంథాంతరవిషయములను వదలి మిగుల
నవీనుల యాశయములు, విశ్వాసములను గొంతవఱకుఁ
బరిశీలించి చూచినయెడల పూర్వోక్తాభిప్రాయమే ప్రతిధ్వ
నించుచున్నది. 'ఆత్మయాత్మను గలసికొనగలదు; అని టెనిసర్
మిక్కిలి తీవ్రముగా నొక చోటఁ బలికెను. అందువలన
వాఁడు (భగవంతుఁడు;)

"ఉచ్ఛ్వాసనిశ్వాసములకంటెను, కరపాదములకంటె
ను మిక్కిలి సన్నిహితుఁడై ప్రకాశించుచున్నాఁడని కూడ
యూఘీగా సమర్థించెను."

అంతటను ఈశ్వరుఁడు తప్ప మఱియొకపదార్థము లేదు. నానావిధరూపాతిశయ రూపములందును, ఈశ్వరుఁడు తప్ప యన్యమేదియును లేదు. సమస్తసంకల్పములు సమస్తచిద్విలాసముల తనివె. అతఁడె నిత్యమైన చైతన్యప్రకాశము. వాఁడు మనయందున్నాఁడు. మన యమృతత్వము (Immortality) న కాధారభూతుఁడు వాఁడే. అమృతత్వము లేక వినాశరహితమైన జీవితమన నేమి? అది యొక మేరకంతు లేనికాలమని మాత్రమే భావము. కాలము, యుగముల తరువాత యుగములు, కల్పము తరువాత కల్పమును పేరిట తిరుగుచుండు చక్రము. మనుష్యుఁడమరత్వమునకంటె, చిరకాలస్థాయిత్వమునకంటె యతీతుఁడు. ఏల? కాలముయొక్క ఏ నియమము ననుసరించి ఏదియారంభమయ్యెనో, ఆనియమముననుసరించి యది యంతమొంది తీరవలెను. మానవుఁడు నిత్యుఁడు, సనాతనుఁడు. కాఁబట్టి యంతములేని యభివృద్ధికి మానవుఁడు ప్రయత్నించుచున్నాఁడు. ఈశ్వరుఁడెట్లు నిత్యుఁడో, మానవుఁడు నట్లు నిత్యుఁడు.

శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయం భూత్వా భవితావాన భూయః,
అజోనిత్య శ్శాశ్వతోయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే.॥ గీత॥ 2. 20

మరణమన, ధరించినవస్త్రమును విడిచిపెట్టినటుల యని మాత్రమే భావము. మనుష్యున కవసరమైనపుడు మఱియొ

కవస్త్రిమును ధరించుచున్నాఁడు. ఈశ్వరుఁడుండునపుడు మానవుఁడు నశించడు.

దివ్యజ్ఞానము బోధించు రెండవ ముఖ్యసిద్ధాంతమునకు మరలుదము. ఈసిద్ధాంతము మొదటిదాని కనుబంధము. ఈసిద్ధాంతమేమని యుపదేశించుచున్నది. అది యేకత్వమునకు సంబంధించిన సత్యము. సమస్తజీవకోటియందుఁ బ్రకాశించుచున్న చైతన్యము. ఏకమగుజీవముగాని, లేక ఏకమగు చైతన్యముగాని యుండజాలినయెడల సృష్టియిందలి నామరూపములుగల ప్రతిపదార్థమునం దీశ్వరుడంతర్యామియైనయెడల సమస్తరూపములుం బరస్పరము సంబంధించియే యున్నవనుట స్పష్టము. అదియే, ఈశ్వరుని యంతర్యామిత్వమునుగుఱించిన యనివార్యమైన ఫలితము లేక ఉపసిద్ధాంత (Corollary )మని చెప్పవలెను. అదియే యేకత్వము. అదియే విశ్వసౌభ్రాతృత్వము. ఈశ్వరుఁడు సర్వభూతాంతరాత్మగుఁడైనపుడు, అతడు సర్వవ్యాపియుఁగూడ నగుచున్నాఁడు. ఆకారణమువలన నొకరికిచెరుపు జేసినయెడల, అది యొరుడతనును జెరచినట్లగును. ఎచట జీవము (Life) కలదో, ఎచటనూహనుకలదో అచట భగవంతుడుగలడు, ఏదియు నమ్మహాయేకత్వ వలనఁ బ్రత్యేకింపఁబడి మాయఁబడజాలదు. అనగా విశ్వవ్యాప్తమగు, ఈశ్వరచైతన్యమేసమస్తపదార్థములకుఁ బోతైన యేకసామాన్యజీవము. లేక ప్రాణము. అదియే నీతిశిక్షాలాధారము. ఈశ్వరచైతన్యము, వ్యాప్తముగను, అనుస్యూతముగనుండు విశ్వమునందు సమస్తపదార్థములు జీవవంతములై

యుండవలెను. ఈశ్వరునియొక్క సర్వాంతర్యామిత్వము మతములన కాధారభూతమై తదన్వేషమున మానవునియెట్లు సంతుష్టిపఱచుచున్నదో, ఆప్రకారమే విశ్వవ్యాపకమగు ఏకత్వమే బాహ్యప్రపంచమున నీతికి (Morality) మూలాధారము. ఈ సూత్రము ననుసరించి యొకరికిమీరు కీడొనర్చునపుడు మీకు మీరే కీడొనర్చుకొనుచున్నారని భావము. మీరుతోడిసోదరునకు హానిచేయునపుడు, ముమ్ముందుగ మీరట్టిహానినిబొందకుండ తప్పించుకొనఁజాలరు. విషమును దెచ్చి నోటిలోవేసికొనిన తరువాత, రక్తమునందును, రక్తనాళములందును, శరీరముయొక్క సమస్తభాగములయందును వ్యాపించి యపాయమునుగలగఁజేయకమానునా? ఆవిధముననే యొకనివలన సంకల్పింపఁబడు దుష్టసంకల్పముగాని చేయఁబడు దుష్టకర్మము గానివిశ్వమునందలి విశాలవిశ్వసాభ్రాతృత్వావ సౌభ్రాతృత్వాదరణము విషవాయుపూరితముగఁ జేసి వేయగలదు. కనుక దివ్యజ్ఞానము వలన నీ యుభయసిద్ధాంతములు ప్రకటింపఁబడుచున్నవి.

నానావిధమతములు నానావిధ మార్గములు లేక క్రమములని నేనిప్పుడే వివరించియున్నాను. ఆమార్గము (Methods.)ల ననుసరించి మానవులీశ్వరాన్వేషము జేయుచున్నారు. ఈశ్వరాన్వేషమందు వారికి వేర్వేరు మార్గములుండుటన్యాయమె. న్యాయమేగాదు. ఆవశ్యకమునుగూడ ఏల? ఒకపద్ధతి (Method) యొకనికి సరిపడుచున్నది. మరియొకపద్ధతి మరియొకనికి సరిపడుచున్నది మనము నానావిధ గుణములను నానావిధసంకల్పములనుగలిగి యున్నాము. అందు

వలన మనమనేకవిధములైన యవసరములనుగలిగియున్నాము. ఇంతియగాక మనము పరిణామక్రమమునందు (Evolution) భిన్న దశలయందున్నాము. మనలో గొందఱు పెద్దవారుగను కొందఱు చిన్నవారుగ నున్నారు. ఎవరును సమానముగ లేరు. కాని సత్య మన్ని ప్రదేశములయం దొకటి గనేయున్నది. దానిని వ్యక్తపఱచుటకు నూరులఁకొలఁది మార్గములునుగలవు. అట్లయ్యును, ఆసత్యము పరిపూర్ణముగ వ్యక్తబడఁజాలకున్నది. సత్యమువ్యక్తమగు నానామార్గములు -పూర్వముదహరింపఁబడిన రెండు భిన్నసిద్ధాంతముల ననుభవములోనికి తెచ్చుకొనిన మానవులవలన నాదరింపఁబడవలెను ఆయాపద్ధతులు లేకమార్గములనాచరించువారు పరస్పరము నిందింపఁబడగూడదు. ప్రపంచమునందలి జీవవంతంబులును, నిర్జీవంబులునగు మతంబులకుఁ జెందిన మానవులకు, మనమేమియు నష్టమును గలుగఁజేయ జాలము. కారణమేమి? ప్రతి మతమునందును కొంత ప్రత్యేక సహజలక్షణ సమన్వితంబగు పరిపూర్ణత్వము (Perfection) గలదు. జ్ఞాని ప్రతిపరిపూర్ణత్వమును సాధింపవలెను. మతముల నానావిధత్వమును గురించి, మనము సంభ్రమమొందవలసిన పని లేదు. అందుకు మారుగ, సత్యమనునది మహాఘనవంతమై. నానావిధ యాకృతులలో నొక సరళరేఖపైన విచిత్రముగ చిత్రింపబడి గోచరమగుచున్నదని మనమందరము సంతసింపవలసిన విషయము. ప్రతియాకృతియు సుందరమైనదే. ప్రతి మతము మానవజాతికి దన స్వకీయమైన సందేశమును బ్రకటిం

చుటకు గొంత సత్యమును గలిగి యున్నది. కనుక దివ్యదృష్టిము పరికించనులోనికి నానావిధమతములకుఁ బరస్పరముండు వివాదములను మాన్పుటకు మధ్య నొక 'సంధాత' (Peacemaker) వలె నవతరించుచున్నది. కనక మనమేల కలహింపవలెను. భగవంతుఁడు మధ్యకేంద్రమువలె ప్రకాశించుచున్నాఁడు. మీరు పరిధి (Circumference) యొక్క యేబిందువునుండి యైనను వానివైపున కరుగ వచ్చును. ప్రతిమనుష్యుఁడును, తాను బయలుదేరిన, బిందువు ననుసరించి యాకేంద్రమువైపునకు భిన్నభిన్న మార్గముల ద్రొక్కుచుండగలఁడు. ఆప్రకారమే నానావిధమతముల స్థితియు మతములన్నియు నీశ్వరుని జేరుటకుఁ గావలసినమార్గములు. మీరు చెన్నపట్టణమున కేగవలసినయెడల దిక్సూచియందలి నాలుగుబిందువులలో నేబిందువునుండియైనను మీరు బయలుదేరి యేముఖముగా నడిచినను చెన్నపురినే చేరగలరు. అతిపురాతనమతములలో నొకమతమిట్లు చెప్పుచున్నది.

"మనుష్యులనేక మార్గములద్వారా నా (ఈశ్వరుఁడు) వద్దకేతెంచుచున్నారు. మనుష్యుఁడేమార్గమున వచ్చినను ఆమార్గముననే నతనికి స్వాగతమిచ్చుచున్నాను. ఏలయనఁగా మార్గములన్నియు నావే.

"అతినవీనములగు మతములలో నొక మతమిట్లు చెప్పుచున్నది.

"మాకు మతప్రవక్తలయెడ విరోధభావములేదు. తిరిగి;

పసిపిల్లల యుచ్ఛ్వాస నిశ్వాసములెన్నియో భగవంతుని జేరుట కన్ని మార్గములుగలవనికూడ చెప్పుచున్నది. మనుష్యులందఱు సమానముగ లేరు. ఆకలినివారణము కొఱకొకమనుష్యునికి యాహార మవసరమగుచుండ. మఱియొకడాకలిబాధచే బరితపించుచున్నను, అన్నమును వాంఛింపడు. ప్రతిమనుష్యునకు తన కుపయుక్తమైన జీవనాహారమునే నామముగాగాని దేహామమునగాని గ్రహించుకొనుగాక, నానా రూప జలభాండములు నదీతీరమునకుం దేబడుచున్నవి. జలము భాండాకృతిని బొందినను ప్రతిభాండమును నింపినజలమంతయు నొకటె. కావున ప్రతిమనుష్యుడును తాను మెచ్చుకొనుచున్న తానాధిక్యత యొసగుచున్న మతమనెడిపాత్రవలన జ్ఞానతీర్థమును గ్రహింపవచ్చును. నష్టమేమియును లేదు. ఒకడు నాగరికముగను శృంగారముగను గన్పట్టు గ్రీసుపాత్రముతో గ్రహింపవచ్చును. ఇంకొకడు ఈజిప్షుదేశపు పాత్రతో గ్రహింపవచ్చును. మఱియొకడు చక్రవర్తులుపయోగించుకొను శృంగారమైన చిత్రంపుపనిగలిగి శోభిల్లుసువర్ణపాత్రము వంటిపాత్రముతో గ్రహింపవచ్చును. వేఱొకడుతన సహజ వక్రంపుహస్తములతోడనే గ్రహింపవచ్చును. దాహముచే శుష్కించి పోవుచున్నకంఠనాళము బుద్బుదంబులచే బులుబులుమని ప్రవహించు నదీజలంబులచే బిపాసదీర్చుకొను నంతకాలము, కలుగునష్టమేమి? పాత్రముయొక్క రూపనిర్మాణములను గుఱించి మనమేల కలహింపవలెను. అన్నిటియందును చైతన్యరూపక జలంబొక్కటియె.

మతప్రపంచమున, దివ్యజ్ఞానముయొక్క స్థానమిది. అది సకలమతములు తమతమమార్గమున మంచివేయనియు, ప్రతిమతమునుండియు, వానివాని తారతమ్యములను భావములను వివాదము నిమిత్తము వ్రాసిపెట్టుకొనుటకు మారుగా, స్వకీయభావములను వృద్ధిపొందింపఁ జేసికొనవలెనని రూఢిగాఁ జెప్పుచున్నది. పిమ్మట దివ్యజ్ఞానమింక ననేక విషయములను గనఁబఱచుచున్నది. అది మతమునకును, నీతికిని, ఆధారభూతము గాక జీవితముయొక్కతత్వమునకును, రాజకీయ ఆదివారములయందు వరుసగా నుపన్యసింపఁబడు విషయములకు సంబంధించిన విజ్ఞానమునకునుఁగూడ ముఖ్యాధారము. కారణమేమి? దివ్యజ్ఞానమువలననే మహాకాశమునందంతట వ్యాపించియున్న దృశ్యాదృశ్యలోకములను గురించియు, ప్రపంచము వృద్ధిపొందుటకు హేతుభూతంబులగు, పరిణామ, పునర్జన్మ, సిద్ధాంతములను గురించియు, ప్రకృతియందలి నానావిధస్థితిగతులకుఁ బరస్పరసంబంధమొదగూర్చునట్టి కార్యకారణ ధర్మమునుగురించియు, పిమ్మట మనుష్యుఁడు నానావిధకర్మ బీజములనువిత్తి వాని ఫలంబుల ననుభవించునట్టి లోకములనుగురించియు మనము గ్రహింపగలిగియున్నాము. ఈరూపముగ దివ్యజ్ఞానము జీవితముయొక్క తత్వమువలె మనకుఁ దోడ్పడుచున్నది. దివ్యజ్ఞానవిషయములయందు చైతన్యమునకు (Life) ప్రాధాన్యత్వము జడము (Matter) నకు సామాన్యత్వము నొసంగబడుచున్నది. జడముయొక్క నానా రూపములద్వారా చైతన్యప్రకాశ మభివ్యక్తమగు

చున్నది. కొందరు ప్రకృతిశాస్త్రజ్ఞులు చైతన్యము సంకల్పములు భావనలు స్థూలపదార్థ సంయోగ ఫలితమని తలంచుచున్నారు. కాని మేమట్లు భావించుచుండుటలేదు; చైతన్యమతే స్థూలపదార్థములు సంయోగీకరణమొందుటకు గారణ భూతములుగ నున్నవని చెప్పుచున్నాము. దివ్యజ్ఞానవిషయకోపదేశము లేముఖముగ బయలుదేరెనో, దానికభిముఖముగ హేజక్ అను తత్త్వశాస్త్రజ్ఞుని పరిణామసిద్ధాంతము లారంభమయ్యెను:— సర్ విల్లియంక్రూక్సు అను సుప్రసిద్ధప్రకృతి శాస్త్రజ్ఞుఁడు, 27 సంవత్సరములకుఁ బూర్వము ప్రొఫెసరు టండాల్ స్థాపించిన బ్రిటిషుప్రకృతి శాస్త్రీయాభివృద్ధిసంఘముయొక్క యధ్యక్షతను వహించుచు టండాల్‌గారి యభిప్రాయమును దలక్రిందుచేసి ప్రకటించెను. ప్రొఫెసరు టండాల్‌గారు 'మనము, చైతన్యముయొక్క నానారూపకశక్తులు జడపదార్థమునందే గలవని గ్రహింపవలెనని చెప్పెను. ఇందుకు విరుద్ధముగా చైతన్యమునందే జడపదార్థముల యొక్క నానాయాకృతులను, మార్పులను గాంచవలెనని క్రూక్సుగారు ప్రకటించిరి. దివ్యజ్ఞానముగూడ శాస్త్రీయ విషయమున క్రూక్సుగారి యభిప్రాయమునే యాదరించుచున్నది. కాఁబట్టి మానవుఁడు కాలప్రవాహమధ్యమున తరంగములవలనను, సుడిగుండములవలనను నిటునిటు దొర్లికొట్టుకొని పోవు తృణమాత్రుఁడగుటకు మారు తనయందలి చిచ్ఛక్తులను, సంకల్పశక్తివలన నభ్యసించి యనుష్ఠించుట ద్వారా తన యదృష్టమునకు తానే నిర్మాణకుఁడగును.

అనగా విధికి తాను లోఁబడక, తన యిష్టప్రకారము విధి యేర్పడును. మనోనిగ్రహమువలన ననగా విధేయతవలన బ్రకృతిని జయింపవలెను. అందువలన నొకప్పుడు తనను బానిసగాఁ జేసి నూఱుఁగూరుచుండబెట్టిన మాయాప్రకృతిని (Nature) జ్ఞానబలమువలన తన యిచ్ఛవచ్చినటుల నుపయోగించుకొనఁ గలడు. కాఁబట్టి తత్త్వశాస్త్రసంబంధముగ విచారించినను దివ్యజ్ఞానముకూడ స్థూలప్రపంచమును (జగత్తు) మిథ్యయనియే చెప్పుచున్నది కారణమేమి? జడము చిత్తునకుపకరణమనియు, సంకల్పమునకు పదార్థములను, సృష్టించుటయు, ఆకారమేర్పరుచుటయు మున్నగు శక్తులుకలవనియు దివ్యజ్ఞానము ప్రకటించుచున్నది.

ఇక మానవ సంకల్పవృక్షముయొక్క యొక మహాశాఖయని చెప్పఁబడు ప్రకృతిశాస్త్రవిషయమునకు మరలుదము. శాస్త్రమనగాఁ (Science) గొన్ని విషయములను గురించి చేయఁబడు అవలోకము. ఆయనవలోకవిధానము ననుసరించి సాధింపనగు ఊహలన్నియు నేర్పఁబడి క్రమముగా నెత్తి వ్రాయఁబడును. పిమ్మట అవి సిద్ధాంతములుగ (Laws) బ్రకటింపఁబడును. ప్రకృతిశాస్త్రము భౌతికవికారములయొక్క యవ్యక్తస్థితినుండి యీ క్రమమైన విశ్వము జనించెనని చెప్పుచున్నది. దివ్యజ్ఞానమును వ్యక్తీకరించు ప్రకృతిశాస్త్రమునకును నవీనప్రకృతిశాస్త్రమునకును గల ముఖ్యభేదమును వివరించుచున్నారు. నవీనప్రకృతిశాస్త్రము మనలోకమేగాక, యితర లోకములయొక్క ప్రకృతి సంబంధములకు మార్పు

లను మానవుఁడు తనబుద్ధీంద్రియముల ద్వారా కనుగొనవచ్చు నని చెప్పుచున్నది. కాని వానిఫలితములు తఱచుగాఁ బ్రమాదముల కాస్పదమగుచున్నవి. ప్రకృతిశాస్త్రసంబంధమైన పరికర్మములయందు (Operations) మిక్కిలి సున్నితమైన యుపకరణములను ప్రయోగించుట ద్వారా మనుష్యుని బుద్ధియు, ఇంద్రియవర్గమును వికాసమొందుచున్నను ప్రకృతిశాస్త్రము, భౌతిక వికారము (Physical phenomena) లను గురించియేగాక, మస్తిష్కజన్య వ్యాపారములగు నిద్రా పారవశ్యాదులను గురించికూడ పరిశోధింపఁబోవుటకు త్వరపడుచున్నది. సర్ విల్లియం క్రూక్సువంటి కొలఁది పురుషులుమాత్రమే మస్తిష్కమునందు (Brain) బసచేయుచున్న చిత్తునకంటె విశాలమయిన చైతన్యముయొక్క అస్థిత్వమునందు నమ్మకముఁగలవారు గలరు. సర్ ఆలివరులాడ్జి అనునాయన మానవుని చైతన్యమును వర్ణించునపుడు మహాసముద్ర మధ్యమునబూర్ణవేగముతోఁ బ్రయాణముసేయుచున్న యోడవలెనున్నదనినుడివెను; మస్తిష్కస్థితచిత్తు (Brain consciousness) సముద్ర జలమున మునింగియున్న ఓడయొక్క స్థూల భాగమువలె నున్నదని కూడయుపమించెను. కాని ప్రామాణికమగు ప్రాచీన శాస్త్రవిషయము (orthodox) గాదు. ఈవిషయము నింతకంటె విశాలవంతముగఁ జేయవలెనన్న యొక నూతన శాస్త్రీయపద్ధతి నవలంబింప వలసివచ్చును. ప్రకృతిశాస్త్రము సరియైనమార్గముననున్నను, అదిపరిశోధిం

చునట్టి యనేకభౌతిక వికారములు స్వాభావికమైన యింద్రి
యములవలననేమి, సున్నితమైన యుపకరణముల వలననేమి,
యవలోకమున కసాధ్యములై మిగుల సూక్ష్మరూపమున
నున్నవి. కాబట్టి ప్రకృతిశాస్త్రముయొక్క గురుత్వము లేక
ప్రామాణికత (wieght) విశాల విశ్వదృష్టికి విరుద్ధముగ దోచు
చున్నది. నవీన ప్రకృతిశాస్త్రము యొక్క స్థితియొకవృక్ష
శాస్త్రజ్ఞునిస్థితితోఁ దుల్యమైనది.

వృక్షశాస్త్రజ్ఞుఁడు సరస్సునందలి కమలమును, పరీ
క్షించుటయందు జలోపరిభాగంబునఁ గనఁబడు దానిపత్రి
ములయొక్క అగ్రములను అంచులను వర్గీకరించి యతిజాగ్రి
త్తతో వానిజాతులను వ్రాసి గుర్తుపెట్టుకొనుటతోఁడనే తృ
ప్తిపొందుచున్నాఁడు. కాని జలాంతర్భాగమందున్న కాడను,
ముకుళించుకొని నీటిపై పునరు గొంచెము వంగియున్న మొగ్గ
లను, వేళ్ళనుగురించి పరిశోధించకయే వెళ్ళుచున్నాఁడు. ఇది
ప్రకృతిశాస్త్రముచేయు పరిశోధనావిధానము.

దివ్యజ్ఞానమునకు సంబంధించినశాస్త్రము (Sceince)
సృష్టియందలిజడము(Matter)యొక్క నానావిధక్రమములను
లేక యవస్థలను సంకల్పముయొక్క అభివ్యక్తమని తెలియఁజేయు
చున్నది. యోగశాస్త్రము మనకుఁ గనబడునట్టి యీలోకమే
గాక యనేక దివ్యలోకములు వాయువుకంటె సూక్ష్మతర
మయిన భూతములచే నిర్మాణమొందినట్టి యనేక దివ్యలోక
ములుగలవనియు, ఆలోకములు వేరువేరుగా నెచ్చటనో
**యుండక యొకదానిలో నొకటి దూరుకొని (ఓతప్రోతన్యా**

యముగ) ఈవిశాలమైన బ్రహ్మాండమును నిర్మించుచున్నవనియు ఈనిర్మాణమంతయు జడమే (Matter) యనియు ఈలోకము మానవునివలన యవలోకింపఁబడి పరీక్షింపఁబడి, గ్రహింపఁబడుటకు దగినవిగా నున్నవనియు బ్రకటించుచున్నవి.

ఏవిధమున జూచినను, మానవుఁడీ స్థూల ప్రపంచము నకు మాత్రమే పరిమితుఁడై యుండలేదు. జడ పదార్థముల యందు సంభవించుచుండు వికారముల నవలోకించుటయందును కలదు. వాని యందణగియున్న ధర్మములను గనిపెట్టుటయందును, మానవజాతియందు బెక్కండ్రు సమర్థులై నవీన భావములను వికసింపఁ జేయగలిగి యున్నారనియు, ఆకారణమువలన మానవజాతి, పరిణామ సౌధారోహణ సోపానములలోఁ గొన్ని సోపానముల నిదివరకే దాటినదని, దివ్యజ్ఞానము ప్రకటించుచున్నది.

మనశ్శక్తులు, కేవలము బాహ్యేంద్రియముల ద్వారమున నే పనిసేయవు. అవియంతరింద్రియముల ద్వారా నైతము పనిసేయుచున్నవి. ఈయంతరింద్రియసహాయముతో శాస్త్రము(Science) తన పరిశోధనలను వ్యాపింప జేయుచున్నది. తార్కిక (Reasoning) అవలోకన (Observations) ముల యొక్క పద్ధతులను బ్రయోగించుచు, వానిఫలితాంశములను మూలసిద్ధాంతములనుండి యాకర్షించుచున్నది. అంతరింద్రియవికాసము సిద్ధించిన వారలవలన నింకను సంప్రతింప బడని విషయములను గురించి నిదివరకేగావింపఁ బడిన యవలోకన

ములను మనమిప్పుడు సత్యములని యంగీకరింపవలసిన పనిలేదు. కాని మనము వానిని ఊహాప్రమాణములుగ (Hypothesis) నేకొనవచ్చును. ఆ ప్రమాణముల ననుసరించి మనము శాస్త్రీయ ప్రయోగము లు (Experiments) ను నిర్మించుకొనగలము. ప్రతిశాస్త్ర ప్రపంచమునను నాయా శాస్త్రములయం దారితేరిన పూర్ణానుభవజ్ఞులు గలరు. ప్రతి శాస్త్రాభ్యాసమునకును దానికి యవసరమగు నియమములు, అవస్థలు గలవు. ఒకడు జ్యోతిశ్శాస్త్రజ్ఞుని కడ కేగి 'అయ్యా! నాకు జ్యోతిషమును నేర్పుడని ప్రార్థించిన యెడల అతఁడే మనును? "నీకు గణితము తెలియునా?' యని ప్రశ్నించును. తెలియదని విద్యార్థి యనినయెడల జ్యోతిషమునం దుత్తమ పరిజ్ఞానమును వడయుటకు గణితము నేర్చుకొనుట యావశ్యక మని యుపదేశించును. ఒక మనుష్యుఁడు నౌకాపంచాంగ సహాయమున సముద్రయాన మొనర్పవచ్చును. తనకిమిత్తము తాను మానములను (Tables) నిర్మించుకొన సమర్థుఁడు కాకపోయినను, సముద్రయానము పూర్తియగువరకు ఆపం చాంగమునందలి • సంవర్గమానము (Logarithm) నుపయోగించుకొనవచ్చును.

అట్లయ్యును, నావికుఁడందలి పద్ధతులను పూర్ణముగ గ్రహించెననియా? కాదు. సాధారణముగ సత్యములనివిశ్వ సింపఁబడు నౌకా శాస్త్రానుభవజ్ఞులు వివరించి వ్రాసిపెట్టిన

---

• సంవర్గమానమనగా సముద్రములో ఓడపోయిన దూరముకనుగొను గణితపద్ధతి.

విధానము (Methods) లపైన - నాధారపడెనని భావము. మనముగూడ నల్లు అవసరమైన ప్రాథమిక విజ్ఞానమును పడసిన వారట్టి శాస్త్రీయ వివరణము (Statements) లను బరీక్షించ గలరు ఆవివరణములు (Statements) భావికాలమందుఁ జేయ బడు పరిశోధనలనిమిత్త ముపయోగపడగలవు. ఏశాస్త్రాభ్యా సమునకైనను, విద్యార్థి యర్హతగలవాడై యుండవలెను. ఆశాస్త్రమునందు సమ్యక్ జ్ఞానమును వడయుటకుఁ గావలసిన కాలమును తగిన సమర్థతయు నావశ్యకము లేదా వేఱొకరి ముఖముగ నట్టిశాస్త్ర విషయములను గ్రహించుట ( Second Hand Knowledge) ద్వారా తృప్తిజెందవలెను. ఏశాస్త్ర ము నభ్యసింపదలచినను తగినయవకాశము తగినయోర్పు అ త్యావసరము. వీనికిఁదోడు తగినసమర్థతయు నత్యావసరము. ఇట్టి యనుకూలము లబ్బియున్న మానవుఁడే శాస్త్రమందయిన కృ షి జేసినయెడల నాశాస్త్రజ్ఞానము దృఢవంతమై యుండనోపు ను. ఏశాస్త్రవిషయమును గురించి విచారించినను కొన్ని యవ స్థలు లేక నియమములవసరమై యేర్పారుచున్నవి.

చూడుము ! వృక్షశాస్త్రజ్ఞునికి యావలోకన శక్తిగావ లెను. సంగీతశాస్త్రజ్ఞునికి, స్వరగ్రహణమందును, రాగమం దును, స్వారస్యమును గపిపెట్టుశక్తిగావలెను. అటులనే యో గశాస్త్రమందు దానికి కావలసిన ముఖ్యలక్షణములు మనుష్యు నకుండవలెను. యోగశాస్త్ర మింకను నిట్లు చెప్పుచున్నది. సూక్ష్మలోకములనుగురించి భద్రముగా పరిశ్రమ జేసి తెలిసి కొన గోరితిరేని, ప్రథమమున మీరు మీస్థూల (physical)

సూక్ష్మ (Astral) కారణశరీరము (mental) లను బహిస్స్వతం తములుగఁ జేసికొనవలెను. ఏలయనగా; ఉన్నతపరిశోధన లను గాను మీకు స్వచ్ఛమైన శరీరములనెడి యుపకరణము లుండి తీరవలెను.

చూడుడు! దూరదర్శినియందు గాని సూక్ష్మదర్శిని యందుగాని యమర్చఁబడినట్టి యద్దపుబిళ్ల మలినముగా నున్న యెడల, ప్రతిబింబము గూఢకళంకపడును. ఆవిధము ననే, అపరిశుద్ధసంకల్పములు, కోరికలు పరిశోధకుని దృష్టిని (investigator) మాలిన్యపఱచును. కనుక మలిన మనస్కు లూర్ధ్వలోకములలోనికి జాగ్రత్తగా, వాని యాథార్థ్యమును నిరూపించుచు పరీక్షించుచు నిరభ్యంతరముగఁ బ్రవేశింపఁ జాలరు.

ఈ ప్రకరణము దివ్యజ్ఞానము మతమును గురించియు, తత్త్వమును గురించియు, శాస్త్రమును గురించియు గొంచెమించు మించుగా వర్ణించియున్నది. ఈ మూఁడు ప్రకరణములలో, ప్రతివానిని గూర్చి దివ్యజ్ఞానము మనకు సవిస్తారముగ బోధింప వలసి యున్నది. దివ్యజ్ఞానము, మతమునకును, నీతికిని, నిలుచుట కాధారమిచ్చుచున్నది. తత్త్వశాస్త్రమును గురించి ముచ్చటించునపుడు జీవితముయొక్క సమస్యలను బరిష్కరించు చున్నది. శాస్త్రమును గురించి ప్రసంగించునపుడు జ్ఞానసాధనకు నవీనమార్గములను జూపుచున్నది. అది జీవితమును బ్రకాశవంతముగ చేయుచున్నది. అది వ్యక్తులయందును, సంఘములయందునుగల భేదములనుగురించి బోధించుచున్నది.

అది ప్రకృతియందలి యపారసముద్రమునందలి నవీనభావ రత్నములను సంగ్రహించువిధానమును మనకు జూపుచున్నది. చివరకు దివ్యజ్ఞానము మానవజీవితమునకు కర్తవ్యమైన గొప్ప సత్యార్థపథములను బ్రకాశించుచున్నది. అది మానవసౌఖ్యములకు భావములవాక్కులందించు పరమానందము (Ideals)లను సంకీర్తించుచున్నది. అపరమానందము నకర్మములు మానవకోటిని దుఃఖములనుండియు, కష్టములనుండియు, పాపములనుండియు లేవనెత్తుచున్నవి. ఎట్లు? పాపము, దరిద్రము, దుఃఖములు మనయజ్ఞానఫలములు. అజ్ఞానమే దుఃఖమునకుఁ గారణము. పరస్పరవివాదములు, పరస్పరజాతిమత్సరములు, పరస్పరవినాశకములగు సాంఘికయుద్ధములు, దరిద్రుల దుఃఖము, భార్యాపుత్రుల రక్షణోపాయమునకు దారిగానని మానవుని నిరాశయు, ధైర్యమునొసఁగి హృదయము బద్దలైన, భార్యలయొక్కయు, పరిత్యజింపబడిన గృహములయొక్కయు, ఆర్తనినాదము; పసిపిల్లలరోదనము, నిస్సహాయస్థితియందు శోచించుచున్న మనుజులయన్నిటికిపైనయొక్క పాటనము మ్రోగుచున్నది. ఏమని? మానవునియొక్క వ్యాకులతను అని వాక్యము నవలఁ అదృష్టము లేక, విధి (Destiny) సుఖముగాని దుఃఖముగాదని గంట మోగినట్లు ధ్వనించుచున్నది. దుఃఖమజ్ఞానజన్యము, దరిద్ర మజ్ఞానజన్యము బాహ్యములైన దార్భాగ్యస్థితులు కుండ్ధాగునములు ఇవి మన జ్ఞానాభివృద్ధి ననుసరించి నశించుచుండును. మన యందలి యాత్మ శాశ్వతమైనది. దానిస్వభావమానందము. ఏల? ఈశ్వరుఁడానంద

స్వరూపము. మీరట్టి బ్రహ్మానందమునందు సహభాగులు. కనుక మీ రజ్ఞానమును దాటి జ్ఞానప్రకాశమును గాంచిన యెడల మీజీవితమున దుఃఖమనునది మీ కదృశ్యమగును. దుఃఖములు మనస్వీయకృత్యములేగాని వేరుకావు. కాబట్టి మనము వేనిని కల్పించుకొని యున్నామో వానిని మన మంత మొందింపగలము. భగవత్సంతతియగు మానవులారా! మీరు ప్రకృతినిర్మితమైన లోకముననే గలరు. ఏల? ఆత్మ ప్రకృతికి యధిపతి యగుచున్నది. మీ రానందముననే జన్మించియున్నారు. మీకు సుఖము బోధింపఁ జాలనివిషయమును నేర్చుకొనుటకు మాత్రము మీరు దుఃఖసముద్రమున తాత్కాలికమునకుగాను మునుగుదు. పిదప పరాధీనము చేయవల్లకాని సొత్తగు మీసౌఖ్యపదవికి మరలుదు. బ్రహ్మజ్ఞానము యొక్క ప్రతిసందేశకుని సంతోష ప్రకటనమిదియె. అజ్ఞానమువలన సంభవించు మీకష్టములు జ్ఞానమువలన సమసిపోగలవు. ఆనందమే మీ యత్యంతరస్వభావము. దానినుండియే మీరు వచ్చుచున్నారు. దానినిగురించియే తిరిగి యేగుచున్నారు.

—::(o)::—